

# అమ్మమ్మ కళ్ళజోడు

రచన: నోని

బొమ్మలు: తనయ వ్యాస్

చదువుట దశ 2

Original Story in English **'Grandma's Glasses'** by Noni
Illustrations: Tanaya Vyas
**'Ammamma Kallajodu' —** Telugu Translation by Sugunasri


First Telugu Edition: 2015

ISBN: 978-93-5022-287-4

Typesetting and layout: Pratham Books, Bengaluru

Printed by: Rave India, New Delhi

Published by: Pratham Books
**www.prathambooks.org**

**Registered office:**
PRATHAM BOOKS
#621, 2nd Floor, 5th Main, OMBR Layout
Banaswadi, Bengaluru 560 043
T: +91 80 42052574 / 41159009

**Regional Office:**
New Delhi
T: +91 11 41042483

**The development of this book has been supported by**
**HDFC Asset Management Company Limited**
***A joint Venture with Standard Life Investments***








PRATHAM BOOKS

# అమ్మమ్మ కళ్ళజోడు

రచన: నోని

బొమ్మలు: తనయ వ్యాస్

అనువాదం: సుగుణశ్రీ





అమ్మమ్మ ఎప్పుడూ తన కళ్ళజోడు ఎక్కడో పెట్టి మర్చిపోతూ ఉంటుంది. ‘‘నా కళ్ళజోడు ఎక్కడ పెట్టాను?’’ అని అస్తమానూ అడుగుతూ ఉంటుంది. అసలు తన కళ్ళజోడు లేకపోతే ఆమె తన కళ్ళజోడు వెతుక్కోనేలేదు!



కాబట్టి నేను తనకి కావాలి. తన కళ్ళు వెతకడానికి, నేను తన కళ్ళు అవ్వాలి!



కొన్నిసార్లు ఆమె కళ్ళద్దాలు స్నానాల గదిలో ఉండిపోతాయి. లేదా ఆమె మంచం పైన. లేదా తన తలమీద.

‘‘అమ్మమ్మా, అవి నీ తల మీదనే ఉన్నాయి!’’ అంటాను నేను.



''అయ్యో! నా తెలివి సంతకెళ్ళా. నువ్వు బాగానే కనిపెట్టావే మనవరాలా,'' అని అంటుంది ఆమె ముసిముసిగా నవ్వుతూ.

అయితే ఈసారి నాకు అమ్మమ్మ కళ్ళజోడు కనిపించలేదు. ఇప్పటికింకా.



నేను అన్ని చోట్లా చూసాను. మామూలుగా పెట్టే అన్ని చోట్లా.

తన తలమీద, స్నానాల గదిలోను, ఆమె అలమారా లోపల, పూజ అరలో, తనకిష్టమైన కుర్చీ క్రింద, ఇంకా భోజనాల బల్లమీద.



ఎక్కడా కళ్ళద్దాలు లేవు. మరి ఎక్కడ ఉన్నాయబ్బా?



ఆ కళ్ళద్దాలని ఎలాగైనా కనిపెట్టాలని నేను అనుకున్నాను. రోజంతా ఆమె ఏమేమి చేసిందో తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాను.



‘‘నేను ఈ రోజు పెద్దగా ఏమీ చెయ్యలేదు. వీణా వాళ్ళ అత్తగారు వచ్చారు అంతే కదా, ఆమె ఎన్ని ముచ్చట్లు చెపుతుందో నీకు తెలుసుకదా! మేము చాలా కప్పుల టీ త్రాగాము. మీ అమ్మ చేసిన లడ్డూలు అన్నీ ఆమే తినేసింది,’’ అంది అమ్మమ్మ.



‘‘అమ్మమ్మకి ఈ రోజు అస్సలు తీరికలేదు. ఆమె తన పింఛను గురించి ముఖ్యమంత్రిగారికి లేఖ వ్రాసింది’’ అన్నాడు రాజు.

‘‘ఆవిడ చాలా సేపు మీ పిన్నితో మాట్లాడారు. రాజుకి స్వెట్టర్ అల్లడం పూర్తి చేసారు. ఆ తర్వాత కొద్దిసేపు నడవడానికి వెళ్ళారు’’ అంది అమ్మ.



ఇప్పుడు నా దగ్గర చాలానే సమాచారం ఉంది. వెంటనే నేను ఇంట్లో చుట్టూరా, క్రొత్త చోట్లలో చూసాను.

అహ్హా! కనబడకుండా పోయిన కళ్ళద్దాలు నాకు దొరికాయోచ్!



ఆ కళ్ళద్దాలు ఉన్నిలో చుట్టబడి, ఆమె బల్ల మీద, ఫోను క్రింద పెన్ను ప్రక్కన పెట్టి ఉన్నాయి. ఇంకా అక్కడ నాకు ఒక సగం తిన్న లడ్డూ కూడా కనిపించింది.

ఈ సారి అమ్మమ్మ పుట్టిన రోజుకి, క్రొత్త కళ్ళజోడు కొనడానికి నేను డబ్బులు దాస్తాను!



# Read India

పిల్లలలో పఠనాసక్తిని పెంపొందించడానికి ఒక దేశ వ్యాప్త కార్యక్రమంగా, 'రీడ్ ఇండియా' ఉద్యమంలో భాగంగా, ప్రథమ్ బుక్స్ 2004లో స్థాపించబడింది. పలు భారతీయ భాషలలో పిల్లల కోసం నాణ్యమైన పుస్తకాలను ప్రచురిస్తున్న ఒక లాభాపేక్ష లేని సంస్థ ప్రథమ్ బుక్స్. మా సంకల్పం 'ప్రతి పిల్లవాని చేతిలో పుస్తకం ఉండేలా' చూడడం మరియు అలా చెయ్యడం ద్వారా, దేశవ్యాప్తంగా పిల్లలలో చదువు యొక్క ఉల్లాసాన్ని వ్యాప్తిచెయ్యడం మా లక్ష్యం. మీరు ఏ రకంగానైనా సహాయపడాలనుకుంటే, దయచేసి మాకు

info@prathambooks.org పై ఇ-మెయిల్ చెయ్యండి.

---



నోని అన్నది రోహిణి నిలేకనిగారు పిల్లల పుస్తకాలు రాసేటప్పుడు ఉపయోగించే కలం పేరు. ఆమె చిన్నప్పుడు, తన పేరు నోని అని చెప్పేవారు. రోహిణి నిలేకని రచయిత్రి, పరోపకారి. ఆమె ప్రథం బుక్స్ కి సంస్థాపక అధ్యక్షురాలు కూడా.



తనయ వ్యాస్ 'నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ డిజైన్', అహ్మదాబాద్‌కు చెందిన చిత్రకారిణి మరియు ఎనిమేటర్. చిత్రాలు గియ్యడంతో ఆమె రోజు మొదలై, మరిన్ని చిత్రాలతో ముగుస్తుంది! చాక్లెట్ లో మునిగితేలడం, కవితలు రాయడం, చందమామ మీద గంతులు వేయడం, పిల్లులతోపాటు కూనిరాగాలు తీయడం, ఫోటోలు తియ్యడం, గోడలమీద బొమ్మలు వేయడం, ప్రతి రోజూ ఏదో ఒక కొత్తది సృష్టించడం ఆమెకు ఇష్టం!

అమ్మమ్మ అస్తమానూ తన కళ్ళజోడు ఎక్కడో పెట్టేస్తూ ఉంటుంది. వాటిని కనిపెట్టడానికి కొన్ని సార్లు ఆమెకు ఒక తెలివైన గూఢచారి కావలసివస్తుంది!

అంచెలంచెలుగా చదువు నేర్చుకొనడం. ఇది రెండవ స్థాయి పుస్తకం.

**1**
**చదువుటలో ప్రారంభ దశ/ పైకి చదవడం**
చదవడము/కథలు వినడములో ఆసక్తి చూపే చిన్నారులకు

**2**
**చదువుట నేర్చుకొనడం**
తెలిసిన పదములను గుర్తించి, క్రొత్త పదములను చదువగలిగే పిల్లలకు

**3**
**స్వతంత్రముగా చదువుట**
వేరొకరి సహాయము లేకుండా చదువగలిగే పిల్లలకు

**4**
**చదువుటలో ప్రావీణ్యత**
నైపుణ్యతతో ధైర్యంగా చదువగలిగే విద్యార్థులకు



**PRATHAM BOOKS**

పిల్లలలో పఠనాసక్తిని పెంపొందించడానికి పలు భారతీయ భాషలలో పుస్తకాలను ప్రచురిస్తున్న ఒక లాభాపేక్ష లేని సంస్థ ప్రథమ్ బుక్స్.

www.prathambooks.org

Grandma's Glasses
(Telugu)
MRP: ₹ 30.00

ISBN 978-93-5022-287-4

